# ప్రేమలత

విస్మృతగీతము, కల్పితము.

గ్రంథకర్త.

గోపురం. రామానుజాచార్యులు,

పొన్నూరు.

First Edition. Nov. 1923.

వెల 0-8-0]  [Price 8 Annas,

# విషయసూచిక.

# ప్రార్థన.

---

శ్రీరమ్యభావే సతతం చరంతమ్
లోకైకపూజ్యం కరుణాప్రపూర్ణమ్
వేదేషుసంస్థం మునిలోకగీతమ్
విష్ణుంభజే భక్తచకోరచన్ద్రమ్.

చ. సిరితన కేలుపట్టి గుణ
శేఖర ! సర్వజగమ్ములెప్డు నిన్
స్మరణయొనర్చుటే విని క
నంగఁ గుతూహలినౌదు మీరలె
వ్వారికొఱకీ తపంబనఁగ
భక్తజనావళికంచొగిన్ సదు
త్తరుఁడయినట్టి శ్రీహరి నే
దన్నుతియించెద నెల్లప్రొద్దులన్ .

ఉ. ఆటలఁబాటలన్ మఱఁగి
యద్భుతలీల సుఖాంతరంగులై
కాటకమందుఁ గష్టమయ
కాలమునందు విచారచిత్తులై

మాటికిఁబొంగి బోర్లఁబడు
మానవపాత్రలఁ బ్రోవఁగా జగ
న్నాటకసూత్రధారిని మ
నంబునఁ గొల్చెద నిష్టసిద్ధికై.

చ. సరసకవిత్వసంపద లొ
సంగి కృపారసమొల్కఁ జూడఁగాఁ
గరము భజించెదన్నలువ
కాంతఁ; గవిత్రయమున్ సభక్తితో
నిరతము సంస్మరించెద; మ
నీషులొగిన్ రసమున్ గ్రహించు నే
ర్పరులని యట్టివారికభి
వందనముల్వొనరింతు నిమ్మహిన్.

ఉ. వారక బుద్ధిమాంద్యమున
బల్కెడు శేటికవిత్వమంచు ల
జ్జారహితాత్మ సంయుతులు
క్ష్మాతలిపైఁ గుకవీశ్వరుల్; దరిం
జేరఁగనీక వారినిర
సింతు; నిరక్షరకుక్షు లెల్లరున్
గౌరవనీయులే? కొదువ
గల్గునె వారెటువాదులాడినన్.

# ప్రభాతము.

తారక లొక్కటొక్కటిగఁ
దర్లెఁ; బ్రసూనపరాగపుంజముల్
ధారుణినిండెఁ; జంద్రుఁడు సు
ధాఘుటకాంతుల నీరసించె; జం
బీరపలాశ ముల్వొవరె;
విప్రవరుండు నదీతటంబునం
జేరెను; మొండిగోడపయి
నిల్చి త్రిభంగులఁ గూసెఁగోళ్లగిన్.

శా. ఔదార్యంబున నిద్రలేపి నిజ
జాయన్ భద్రముల్ సెప్పి తాఁ
గేదారంబునకుం గృషీవలుఁడు నే
గెన్; మూఢచిత్తుండదే
ఛేదించెంగద వంటకట్టియలకై
శృంగార భూజ ప్రశా
ఖాదుల్; భల్లునదెల్లవాటె నల చో
రానీకముల్ పాఱఁగాన్.

ఉ. మ్రోడుచిగిర్చెఁ దీవ పువు
పూచె; నురుల్గొనిచేత బోయు వె
న్నాడఁగఁ గొమ్మకొమ్మకెగు
రాడెశరాకము; మంచెపైఁగడున్

వేడుక కన్నెతోఁ గలిసి
పిట్టలఁగొట్టెను గోడెకాఁడు ; పూ
బోఁడిరొయొకర్తు చేఁ గలశ
ముంగొని యేటికివచ్చెనీటికై .

చ. కనుఁగొని ప్రేయసింగడు సు
ఖంబునమున్గి రథాంగమొందు సాం
త్వనములఁ దేరె ; గోగుపువు
పై మధుమక్షిక వ్రాలె ; రావిచె
ట్టునఁగొనపైఁ బికంబొగిఁ గ
డుంగడుఁగూసె ; వినిర్దయాత్మలై
పనిఁగొని కర్షురీఁగ నగు
బాటుగ నేగె జనంబు దూఱఁగాన్ .

చ. మొదవులు కట్టుత్రాడువిడి
పోయిన లేగలఁదన్నెఁబాలచే ;
నదయుఁ డెనందుదొంగిలెఁ గ
టా ! నయనంబులనుండినిద్ర ; యే
ద్వాదొడఁగె బాలకుండు బహు
భంగులుగా ; రవి రక్తుఁడౌచు బూ
ర్వాదిశముఖంబు ముద్దుగొనె
వాయసముల్గనఁగా గృహావరిన్.

ఉ. చాలమి నిద్రమందుఁడిల
సారెకుదూలెఁ ; దుపారబిందువుల్

బాలతృణంబుపై రజత
వారికణంబులనొప్పి ; బిచ్చుగాఁ
డే లొకొవాకిటన్నిలిచె
హేమకుచాంగన పిండిమ్రుగ్గులన్
మేలుగ దిద్దుచుండె నళి
నీడళివక్త్రవిలాసియై కడున్.

ఉ. పచ్చనియాకు వ్రాల నిల
పైఁగొని బాలికయొర్తు తిన్నెపై
గచ్చనకాయలాడు చెలి
కై వెదుకాడెను; జంకఁబొత్తముల్
బుచ్చుక గుజ్జు మ్రాసిదరి
బోయెను బాలుఁడొకండు కోతి కొ
మ్మచ్చుల నాడఁగాఁ; గుపిత
మానసుఁడై రవివచ్చెఁబైపయిన్.

చం. ఒకపరి మర్మగర్భిత వ
చోక్తుల బేరములాడి పుష్పలా
వికలను వేకువం బనిపి
వేసి శుభంబుగఁ దోటమాలి మ
ల్లికలకు నీరువెట్టెఁ గద
ళీతరుశాఖలఁ గోసె దేవ పూ
జకొఱకు పొన్నపూవులఁ బ్ర
శస్తములుంచెను దామరాకునన్.

---

# ప్రసూనము.

---

అమృతమొందుతావున విషంబుమరేః ముండ్ల
గల లతాగ్రంబున గులాబి కాంతులీనెఁ:
జివురుపైకి సీతాకోక చిలుకయెగిరె
బాలుఁడాడంగ నద్దానిఁ బట్టదివిరె.

చం. ఇరవుగఁ బుష్పరాజము ప
యిన్ మనముబ్బిఘులూర నద్దెసల్
పరువెట్టుటేమిఁ గన్గొని చి
వాలున ద్రుంచితిఁ; దృప్తిదీరఁగా
నురమున హత్తి హత్తి విజ
యోన్నతిఁ గాంచితి నంతబిల్లగా
డ్పరయ హరించె గంధ మహా
హా! ప్రియమందుచులుద్ధచిత్తుఁడై.

ఉ. తుంటరి దుష్ట చేష్ట మది
దోఁపఁగ నాకు నిగూఢవృత్తిపైం
కంటక మొసఁగు ముద్ధృతము
కంజముఖం; బికకూజితంబులన్
వింటిని విందొసర్చువవి
వీనులకుం; దరి మావిగున్నపైఁ

గంటిని జిల్కపోయుగము;
గాననమందున వెన్నెలై చనెన్.

చ. కనుఁగవఁ బుష్పరాజమును
గంటి దళంబులు వాడివత్తులా
యె; నిరసనంబుగొల్పుమది
కెంపదనంబు నంత తృణీకరించిరెన్
మనమలికోమలంబు తెర
మాటున కేగివిషాద మొందెదన్
వెనఁగొన బాష్పముల్; హృదయ
వేదన తీరనిదాయె నిత్తఱిన్.

మ. విలసత్కోరక సంయుతంబుగడ యా
వృతంబుల; ప్రేమాస్పదా
జలి మత్పుష్పముఁగోలుపోయితి ధరా
చక్రంబునందెచ్చటే
కలవంగాంచినచో లభించును? గటా!
కన్నీటియొడ్డునై
నిలిచెన్; బచ్చికపైఁ గురంగి సుఖియై
నిద్రించెగాఢంబుగన్.

# సరిత్తటము.

రుచిరగళంబుగల్గిన స
రోజని! యెవ్వతెవీవు? నిర్జన
ప్రచురసరిత్తటంబున బ
రాకుననుంటివదే భవద్వదం
బు చెలిమిగోరి పద్మము ప్ర
భాలితపంబొనరించెనీటఁ; బు
ణ్యాచయమెఱుంగనామె; నయ
నంబులహా! చలనంబులేమిటన్?

తే. గీ. మడుఁగుదరిఁ జేరి కైవర్తమనుజుఁడొకఁడు
వామపార్శ్వంబునన్ బుట్టఁబదిలపఱచి
మొనను గొక్కెమునఁ దగిల్చి కరము కోలఁది
విసరె గాలంబు నడినీట వేడుకలర.

ఉ. పూర్తిగ్రహించి గోకులము
వోయెఁగయిండ్లకు; సీటికంచు దే
జారుగఁదెచ్చినట్టి కల
శంబెటునుంచితి? వచ్చుటచ్చుటన్
శారిక ప్రొద్దుబుచ్చఁగమ
నంబులఁగాంచి మయూరమొందు నిన్

చేరఁగవచ్చెఁ గన్గొని వి
శేషము లారయుమా ప్రియంబుగాన్.

చ. లలితవిలాసినీకలన
లాలననీదుచు రాజహంస ని
ర్మలసలిలంబునందు నడు
మన్నిలిచెన్ మలయానిలంబు కాం
తల హృదయాంబుజంబులఁ గ
దల్చెనొకింత; గురుండు వెంట శి
ష్యు లనుగమింపఁగా వెడలెఁ
జూడఁగ సృష్టివిచిత్రనైపుణిన్.

ఉ. వింతలునీప్రసంగములు
వెంగలికింగలచా దయారసం
బంతగఁ బాలవన్నెగల
యాకవటాకులకై శుకంబుతోఁ
బంతములేల ? కావుపసి
బాలిక బుగ్గలు ముద్దులాడె దీ
వింతగ లేచిరమ్ము చన
విచ్చుటయానిఁక నొండుపల్కుచోన్.

# ప్రే రా న.

అమలములై విరాజితము
    లై నయనోత్సవదాయకమ్ములై
యమరిన లేతచెక్కిళుల
    యందపు ముద్దులు మూటగట్ట న
ర్వ్యముఁ దనకేయటంచు బని
    బాలుఁడు పవ్వలకై కడింది బా
ష్పములను రాల్చిగాల్చి భువి
    పైఁబడి నిద్దురవోయె నంతలోన్.

ఉ. సంగడి నొక్కనింబతరు
    శాఖతొదన్ శిరమారఁగా శిలా
శాంగన ప్రాపునంగల ప్రి
    యంవదునిం గరుణించి చుంబనా
లింగనముల్గొనర్చె; వ్యాదు
    తీలల నుచ్యమెటింగనేము తృ
ప్తింగనలేదొ శాగిక వి
    వేకముమాలి ప్రపంగ మాడెదుర్.

చం. దినముఁ గడాని గుర్డిడిన
    దృష్టి వహించని లోభి యొక్కవే

టువ దెగటార్చి బాతును గ
డున్ విఫలుండయి యుద్వేఁగా దోడం
గెను నలువైపులన్ జనులు
గేలియొనర్చుచు ముక్కుపైన వ్రే
లు నునిచికొంచు నిల్చిరి త్రి
లోకములం గన మిట్టిదం చొఁగిన్.

ఉ. అచ్చపుఁ జీకటిం గరము
సందున గైకొని కంచెపాలెము వే
వచ్చెను బిచ్చమం దేమల
వారిబలోచన యుల్లయారిపో
రిచ్చిన దేమి చేయనగు
దృష్ణమునగౌ భుజించువారు పో
వచ్చునసంగ త్రాల్కరుగ
వాకిటి నిల్చును నిల్వనన్ సదా.

ఉ. ఈసున బాక దొందమన
నింబున భాసన కద్దిరయింత పే
రాసయొకాని లేజివ్వురు
టాకులకై పయనంబుచేసీ యా
యాసమున న్నిజేశు నుద
యంబున నే పనుపందలంచి యెం
తే సరసోక్తిగాఁ బడక
టింటికిఁ దా నిదురింపఁగాఁజనెన్.

# ప్రేమలత.

మందునింగని లోకనిందఁజెదనిచో భా
యాదేవి యొకసాటి యనఁగనొప్పు
దోషాకరునిఁబెంచి దురితంబుఁగననిచో
ననసూయ సుంత పేర్కొనఁగఁదగును
శక్తిగర్భముఁదాల్పజాలనిచో నరుం
ధతి యొకించుక యీడనంగఁబరగు
పురుహూతజననియై ధరఁజేరుగోననిచో
నదితి యోజింప జోడనఁగఁజెల్లు

గీ. ఇట్టిలోటుపాటులుగల యింతులెల్ల
నయ్యతివ కొక్క ప్రతియౌచు నలరగలరె
యనుచు బుధులెంచ భువిలోననతిశయిల్లెఁ
దోయజాక్షి ప్రేమలత విద్యుల్లతాంగి.

సీ. సరసేందుముఖి కటిస్థలిఁగాంచి ధైర్యముం
గోల్పోయి సింహము గుహలడాగె
కొమరాలి ముద్దుపల్కులు వినన్ దినమున్ ఫ
లాహాగ్రమున శుకం బలసి సొలసె
లలితంపు కలికిచూపుల కెటున్ సరిరాక
యళు లక్కజము దోప నడవిఁజేరె

అంగన నడల సోయగముఁగాంచి తటాక
ములలోన రాయంచ జలముఁ గ్రోలె

గీ. కాంతనాసిక సౌందర్య గరిమఁగాంచి
సంపెఁగ మొలంగె నొక యాకు చాటుగాఁగ
సుందరాంగి దేహచ్ఛాయఁ జూచినంత
పచ్చని పసిండి గనులలోపలనె డాగె.

సీ. ముద్దులగుమ్మ కెమ్మోవికోడఁగ ద్రాక్ష
ఫలము లాపందిళ్ళఁ బట్టి వ్రేలె
గనకాంగి బిగిచనుంగవ కీడనఁగరాక
యల మంజరుల్ వనంబందు వాడె
సతి యూరువులతోడ సరిగాక యరఁటుల్ గృ
హాంగణంబున నెండి యంగలార్చె
చపలాక్షి చిఱునవ్వు చాయతో నెనగాక
బొండుమల్లెలు చెట్ల పొందువడసె

గీ. అతులితములైన చెక్కుల యందమునకు
గ్రిందుగాఁగఁ దీగెల యండ గీలుకొనుచు
లేత లవలీదళంబులు లెస్సదోఱఁగె.
నాతి పాల పల్వరుస నెన్నంగఁదరమె.

సీ. నిద్రలేచినతోనె నెమ్మిచిల్కకు పాలు
ఫలమిచ్చి తియ్యమాటలను గఱపు
అతిథి రా నర్ఘ్యపాద్యములొసంగి సగౌర
వంబుగాఁ గుశలంబు బ్రశ్నసేయు

ప్రొద్దు ప్రాలినయంత ముద్దుబాలికకుం ద
లనుదువ్వి బొట్టునలంకరించు
ఏప్పుపాపనిఁ జంక నెత్తుకొంచల కాక
మునుజూపి ముద్దనోటనిడి ప్రోచు

గీ. కుంటి గ్రుడ్డి మాటివికలాంగులను గనఁగ
సహృదయాంచిత ప్రేమపాశములఁగట్టి
యాదరించు ననవరతం ; బధిక భక్తి
శ్రీశుభజియుంచు గరుణార్ద్రచిత్తయగుచు.

సీ. తరళాక్షి ! నీకు సంతానమా యన్నచో
సాగరమ్ములనన్ని చదివిచెప్పఁ
గుటిలకుంతల ! భవత్కాలమేమి యనఁగఁ బం
జరమునంగల యండజమునుజూపు
చెలువ ! నీవిభుపేరు చెప్పుమన్న "నారామ
ము" నను మధ్యాక్షరంబులనుజూపు
ఇంతిరో ! నీవాస మేదేశమున మాాడు
బొమ్మజూల నొకతావుననె యునుచు

గీ. వామలోచన ! నీవాడుభాషయనిన
విజయనగరంబు వంకనే వ్రేలుజూపు
ఉవిద వెన్వెంటనోసఁగు ప్రత్యుత్తరముల
గ్రాహ్యములఁ జేసికొనువారిఁగాంచుటరుదు.

# సంధ్యారాగము

చరమాద్రిఁజేరి సూర్యుఁడు
కరమరుదగు కాంతిచేఁ బ్రకాశిల్లుచు బం
గరు పొడగల తుదికిరణము
నరయంగాఁ బరమలోభి యయ్యైకొనియెన్.

ఉ. భృంగము చంపకిన్ విడిచి
యేగెను ముండ్లుగలట్టి కేతకీ
సంగముకోర్కి; దారసిలె
సంజయొకింత; శమీరపత్రముల్
సంగడి సల్లలాడవాక
సారియుఁ; జెట్టునకొక్కపక్షి యు
య్యెం; గరుణాలిలేకమున
నింతులబంతి వనాన గ్రుమ్మరెన్.

చ. గుమివిడి జక్కవల్ గవలు
గూడెఁ గులాయములందునం; బవల్
శ్రమమునకోర్చి తెచ్చినవి
సారతరంగములై వధూకపో
లములఁ దృణీకరింప మివ్వు
లన్నవకోమల పల్లవంబులుం

చి మగువపాదముల్కడ వ
శీకరణంబున నిల్చితిన్ దరిన్.

మ. గళికన్గీరుచు గోటఁ జూడదు లస
త్కంజాక్షి కన్నెత్తి యే
మఱుమాటాడదు మిన్నకుండునకటా!
మన్నింపమిం జాల సి
గ్గళి యొక్కింత శిరంబువంచుక యుషః
కాలంబునన్ వాని నెం
దఱో కైకొందురటంచు నాపుడమిపై
నం ద్రోసి పోవైచితిన్.

తే. గీ. ఏనె పలుకరించితి నంత యిచ్చ నెఱిఁగి
"తరుణి! నాయందు నీకు స్వాతంత్ర్య మధిక
మందులకె చలించవాకింత యాదరించ
వార! నిశ్శబ్దమునకిదే కారణం బె
ఱుంగనాయె నాటలలోసి భంగినేమొ
యెమఱచినట్టులుండెద వెన్నఁడైనఁ
జేకొన వాసంగు కానుకఁ; జిన్ననాటి
పలుకు మఱచితివాడిన బాసఁదప్పి."

ఉ. మానవతీలలామ! లత
మాటున కేగెద వేల? నందనో
ద్యానమునన్ సఖీజనము
నాపలికంపి గులాబి యందముం

బానసమొనర్చుచుంటివి శు
భప్రదమాయెఁ; గపోతచంద్రముకే
శ్యేనము వెంబడించెఁ గరు
ణింపుము పిల్వఁగనంపి ప్రేయసిన్.

చ. విమల యశోవిరాజితవు
విశ్వజనాదరణీయ వేటి య
క్రమమిదినీకు? కంటఁ దడి
గాంచెదనంచు దలంచి నీదు న
వ్వు మెఱపు లంపి వన్నెగఁ గ
బోదిని జేసెద వక్రజంబుగా
శమథ మెఱుంగవచ్చె రిపు
సంతతికిం; బలుకాడుమా వెసన్.

ఉ. నీరజవైరి యయ్యో శశి
నీముఖముంగని; యేటికిట్లు చే
యూరక పిందెలం జిదుము
చుంటివి? కింశుకవృక్షశాఖపైన్
గీరము కోరచూపున గ
నెం గనుఁగొమ్మదె! యెంత నిశ్చలో
దారగుణాలవాల వెటు
తగ్గి తలంక విదంత వంతమే!

---

# కోకిలము.

---

చంపకమాలిక.

కులుకుచుఁ బేరఁటాల్వలెఁ జి
        గుళ్ళను మెక్కుచు నెంతో కావియుం
చులుగల నల్ల ఱెక్కలను
        జూడఁగొలందిగ మేనఁ దెల్ల చు
క్కలును బదమ్ములం బసుపుఁ
        గల్గి విరామముతోడ వృక్షశా
ఖలపయిఁ గానిపించెదవు
        కంటికిఁ గోకిలమా ! వసంతమాం
మ లలితభావగీతముల
        తోఁ దులదూఁగెద వుక్కపట్టు సాం
పలరెడు నుష్ణదేశ మవు
        డప్పుడు బోదువు శీతలంపు భూ
ములకల యత్తయింటికిని
        బుట్టినయింటికి వచ్చిపోవు కో
డలివలె ; నేలనందము లి
        డంగనె ముక్కున నుంచుకొంచ దే
పలుమఱు నొందు నొండితర
        పక్షులగూండ్లను బెట్టుదాన వె

మ్మె లోఁదవకుండఁగాఁ బోదిగి
మేపు శ్రమంబును లేక ; పెట్టిప
క్షులు తమబిడ్డలవ్వేఁ యును
చుం బెనుపంగనె, లజ్జవీడి మా
యులకు గడంగి నీదుశిశు
వమ్మయె మేలనిపించి వానిపి
ల్లలఁబడఁ ద్రోయుఁగా! క్షితిత
లంబున? నో పికమా! వసుంధరన్
దలఁపఁగవచ్చు నిన్ బరభృ
తంబుగ తెక్కులుగూడవచ్చినన్
నెలవయిఁ గొంతకాలమెటో
నీవువసించి దయావిహీన సం
పులినత నక్కటా! తరలి
పోదువు పెంచినతల్లివీడి ; ని
ర్మలమగునట్టి తియ్యని స్వ
రంబొకటే దయచేసె దైవమం
దులకె విశేషగౌరవము
దొల్తనొసంగెను నీకు మాధు ప్రే
మలత; మఱింతకంటె నొక
మంచి కనంబడునొక్క పికదర్
జెలువుగఁ; గాకి యందమును
నీయదియొక్కటిగాదె చూడఁగాన్.

# రహస్యము.

సురుచిర కోరకంబుకడ
    సోకెను జక్కని పిల్లగాడ్పు తీ
వరముగఁ జెంతనే యరుణ
    పల్లవ మొందు రహస్యమాడె సం
బరపడు చానకుం దెలియ
    వచ్చె నొకింత; శ్రమంబుబూని బం
భరమెఱుఁగంగఁగోరి యది
    ప్రాపుననే తిరుగాడె దిర్దిరన్

మ. పరదేశంబునకేగి వచ్చెడుపతిన్
    వామాక్షి వీక్షించి స
త్వరతం జల్లని నీరముంగొని కడుం
    బాదంబులం గడ్గి గా
ఢ రసాసాదితభోజనంబయిన తో
    డన్ శయ్యపై నాథునొం
టరిగాఁగన్గొని సేమమా యనెడు మా
    టన్ విన్న నాహ్లాదమా.

సీ. సతతదానక్రియా సౌశీలునకు యశం
    బల రహస్యంబు పొంతలను బట్టె

నిత్యసత్యవ్రతోన్నత్యశాలికి ఘనం
    బమితంపు గూఢ మార్గమునఁ జేరె
నిరతాంచిత దయా వినిర్మలాత్మునకు పే
    రుఁ బ్రతిష్ట దొంగదారులను వచ్చె
అనిశార్త జన రక్షణాహ్లాదునకు గీర్తి
    మూలమూలలనుండి పొంగిపొరలె

గీ. దక్షిణ కరంబు వొనరించు దాన ధర్మ
నిరతి వామహస్తంబున కెఱుఁగనీక
మెలఁగు ప్రేమలతాతన్వి కెలమిమీఱ
నతిరహస్యంబుగాఁ గీర్తి యలరె మిగుల.

గీ. అవసి నిరువుర కతిరహస్యముగఁ గలహ
కారణముబెట్టిన ఖలుండొకండు నడుమఁ
జేరి చేట్వడె రెంటికిన్ దూరమయిన
రేవణుని చందమున జూప జేవపడఁగ.

ఉ. కందఁగఁ జెక్కుటల్ నయన
    కంజములుంగడు నెఱ్ఱవాఱ నే
డ్వందొడఁగెం గుమారుఁడొక
    బంతి నొసంగిన నూఱడిల్లఁడా
చందుని జూపినన్ మఱగి
    చంకకు రాడదియేమొ తల్లి బా
లుం దగఁ జేరి చెప్పెఁ జెవి
లోనఁ; బ్రశాంతములాయె నగ్గెడల్.

# కరుణ.

---

మామిడి తోఁపుల్ఁదిని
మత్తిలి చక్కనిశాఖలైన సా
ఖ్యాముల వాయువీచికల
నల్లన గానమొనర్చు కోకిల
శ్యామను బూలమధ్య జవ
రాలు గనుంగొని లేతనవ్వు నె
మ్మోమునఁ బాలవన్నె వెలి
బుచ్చ బ్రతిధ్వను లిచ్చుచుండఁగా.

తే. గీ. వృక్షశాఖాగ్రమునుండి కృకణ మొండు
కునికిపాటున బట్టను దోలుపోయి
శర్కరాతలంబున వ్రాలి సమసెనకట!
పథికుఁడొక్క బాష్పకణంబు వదలిచనియెఁ,
గోవిదారముల్ రుధిర సంగూఢములుగ
దోఁచె; నార్తారవంబులు వీచెదిశల;
నిలుచు నిలువున నీరాయె నెలతహృదయ
మవని యంధకారావృతంబాయె మిగుల.

ఉ. అంచితరీతి బాణమున
నంబిడుచుం బొదరింటిచాటునం
బొంచిన చెంచుఁగాంచి తృణ
ముఁ గ్రహియించెదు లేడి యక్కటా!

వంచి శిరంబు ప్రోల నిలు
వంబడె బోయఁడు నక్కువెట్టి మో
టించిన కార్ముకశరబటనె
డించి చనెం గరుణార్ద్రచిత్తుఁడై.

ఉ. అచ్చర మచ్చికంటి విన
యాభినయమ్ముమవచ్చి పిల్లికిఁ
బిచ్చమిడంగనేరని వి
వేక విహీనఁ దమాజఁ జూచి గో
ర్వెచ్చని పాలువోయుమనె
శ్వేతముకాళికి లోకమెల్లఁ దన్
మెచ్చిమనంబుఁ ద్రిప్పుకొను
మేలగునంచువచించెఁ బ్రేముడిన్.

# అసూయ.

ఏచెసఁగాంచినన్ సుజను
　　లేవపడంగనె యీయసూయ దా
యాదుల పంచఁబట్టెను; క
　　డాటలనాడెడు యౌవనంపు భా
గ్యోదయ బాలికామణుల
　　యొద్ద నటించెడు నప్పుడప్పు; డా
హ్లాద హృదబ్జలా నవతు
　　లందు బెనంగొనె మాటి మాటికిన్.

చం. పరగఁ జిగిర్చి పూతగాను
　　పచ్చని తీవనుదొల్చెఁ జీడపు
ర్వు; రుచిగ కాంతి గిట్టక మ
　　ఱుంగున ఘూకము చూచుగొంచు వే
లె; రతనముం గనంగ మర
　　లెం గృకవాకము; పొట్లపొత్తు కా
కరకు పోసంగకుండెఁ గలి
　　కాలము పూచి ఫలించెఁ జూడఁగాన్.

సీ. సత్కార్యములొనర్చి చనుదెంచెడు ధనేశుఁ
　　గాంచినంతనె లోభి కన్నుగుట్టె

విద్యాధికుఁడటంచు జేర్గొన్న కవిఁగాంచి
క్రేగంటఁ గుకవి పంకించె శిరము
పలువురచే మెప్పు వడసివచ్చు వివేకిఁ
గనలేక మూర్ఖుండు కాఱులాడె
ధర్మార్థమై పుణ్యతముఁడుంచు నన్న స
త్రములలో నొకపాపి ఱాలుఁ ఱువ్వె

గీ. సువ్రతుని మాయిఁగా నెంచి శుచిని దంభిఁ
గాఁ దలఁచి శూరునిర్దయుంగా గణించి
మునిని విమతిఁగాఁ జూచి దుర్జనుఁ డొకండు
నిందజేసె నసూయతో నిండినిండి.

మ. సుజనుం డొక్కరుఁ డాదరార్ద్రహృదుఁడౌ
చున్ మేలుకార్యంబులన్
విజయుం డై చనుచుండఁగా ఖలుఁడు క
స్నిగ్గార్చు లోలోపలన్
గజరాజంబు బలీయమై కను క్షమా
కారుణ్య విన్యస్త మా
చుఁ జనం జూడమె యూరకుక్క మొఱుఁగన్
సుంతేని లోటుండునే.

తే. గీ. ప్రకృతిఁగల చిత్రగతు లెన్న బ్రహ్మవశమె
లత యొనర్చెడు ప్రేమపూరితము లైన
పనులకా యసూయాపరుల్ పాడిగొనక
కంటఁ గారంబుగొనిరి పెక్కండ్రు జగతి.

# బాలుఁడు.

---

భరమై తోఁపఁగఁ దండ్రిరామి జననిం
ప్రశ్నించి కమ్మింప నే
రరుగా యంచు వచింపుచుం గలము' సీ
రాబుడ్డిఁ' గైకొంచు న
క్కరముల్ వ్రాసె "అ ఆ" మొదల్ "క్ష" వఱకుం
గౌతూహలస్వాంతుఁడై
పెరమాటల్ విపులంబుగాఁ జదివి వి
న్పించెం గృపం దల్లికిన్.

తే. గీ. ముదముతో స్నేహితులు గోడమొత్తులందు
బొంచియుండఁగ నోరచూపున గ్రహించి
కన్నతల్లిని మఱపించి కౌతుకమున
సన్నసన్నగ జారె బాజారుకడకు.

తే. గీ. అల్లిబిల్లిగ దిరుగాడి యలసి సొలసి
విశ్రమించిన బుడుతండు వివిధగతుల
బారు కాఱుమబ్బులఁ గాంచి పరుగులిడుచు
నెచటి చెలికాఁడు పంపె నంచెంతొ బొగిలె.

ఉ. మించులతోడఁ గ్రమ్ముకొనె
మేఘములెల్లడఁ గుంభవృష్టి వ

క్షించి క్షణంబులోన వెలి
సెం; బసిబాలుఁడు కాగితంబు జే
జించి పసందుగాఁ బడవఁ
జేసి ప్రపూర్ణ జలప్రవాహ మం
దుంచె వనంబునంగల మ
హాత్మ్యులిము ల్లోనివచ్చి నింపుచున్.

మ. అల మెవ్వారును జేతనందుకొన తే
రా? చంద్రబింబంబు పి
ప్పల శాఖాసమితిం దగుల్కొనియెఁ; న
ఱ్ఱాలుండు వేవచ్చి ప్రే
మల తాతన్వి గవాక్షమందుఁ ముఖ సి
మాజాన్ని లేవఁగ్లోగిన్
దొలుకాడం దనుజూచు వేళ గరమం
దుంగొంచు ముద్దాడెడున్.

ఉ. అంతనె ప్రొద్దువోయెనని
యక్కజమందుచు బాలుఁడావి యొ
క్కింతగు పారము౦ జదివి
యేగెఁ బరుండఁగ నంతనోడ దే
శాంతర మేగి పూవుల స
ఖాళికి నందఁగఁజేసి క్షేమ వృ
త్తాంతముఁ దెప్పునంచు భ్రమ
దంబున నిద్దురలోన బల్కెడిన్.

# ప్రతిఘము.

---

పరగ శుకంబు కొమ్మ కొన
వ్రాలుచు నాకుమఱుంగుపిండెదైై
వరలెడు జామికాయ గన
వచ్చిన నొక్కెడ లక్ష్యముక్కుచేఁ
బొరిపొరి గ్రుచ్చి గ్రుచ్చి సరి
పుచ్చె మిగుల్వడినట్టి ప్రొద్దు చూ
ప ఔఁగఁజకార గుల్కొసఁగి
బైటకుదోల దయావిహీనుఁడై.

సీ. సంజచీకటి గ్రమ్మ జాయతోఁ గలహించి
తన త్రోవఁబోయె రథాంగమొండు
కాలపక్వములేమి బాలచంద్రుండు ప్రా
చీ కుటుంబిని వెన్కఁ జేరిసిలిచెఁ
బ్రియులరాకకు వేచి విరహిణీజనము గా
దిలివీడి మారుని దిట్టిపోసెఁ
దమ భర్తఁగానక కమలముల్ మోముల్
మొట మొట లాడించి ముడుచుకొనియె.

గీ. బంచశరుఁడంపి నట్టికోపంబనంగఁ
దిమిరమెల్లెడ నిండివేధించె విటులఁ

గ్రుద్ధుఁడొకఁడు వేసిన చిచ్చుగుండ్లనంగఁ
వారకల్ ఁజూపె గగనమధ్యంబునందు.

చ. ఇలువిడి యింతకాలమెట
కేగెఁ బ్రియుండని కోపచిత్తయై
చిలుకలకొల్కి కల్కి మఱు
చింతకు లోనగుచున్ దుకూలమున్
నిలువున గప్పికొంచు శయ
నించెనతండరుదేర సల్లక
ల్వాల జతనుండి వెల్వడఁగ
వాడిశరంబు లభేద్యపంక్తులై.

ఉ. దొంగవలెం జరించుచు వి
టుం డుదయంబుననుండి ప్రొద్దు వా
రాంగన తోడుతం గడపి
యర్ధనిశందన యిల్లుసేరి చూ
డఁగనె కన్నుమూయఁగఁ గ
డంగు కులాంగనఁ గాంచి చేతి క
ఱ్ఱంగొని మోఁదె సిగ్గువిడి;
రాక్షస కృత్యము వేఱయున్నదే!
గీ. గడనలేక సంసారముం గడుపలేక
మూఢ చిత్తుండు ముక్కోపి మోటువాడు
కనికరము వీడి యొకయమ్మ కన్నబిడ్డ
నట్టె హింసించె భార్య యైనట్టి కతన.

# నిశ్చలత

వారక రేలతాంగి నడి
ప్రాయము దాఁటెను "టింగుటింగు"మం
చారయ రెండుగొట్టె గడి
యారము; తైలము లేమిదివ్వె బా
జారున మిన్కుమిన్కుమని
జారెఁ; సుభాగ్యులు గష్టజీవుల
న్వారును గుఱ్ఱువెట్టి దరి
వారడల న్నిదురొందిరిమ్ముగాన్,

చం. వెడలెను గన్నగాఁడు పుర
వీధులు నాలుగుఁజుట్టిరాఁగ; లో
నడలుచుఁ ద్రాగుబోతతి ర
హస్యముగాఁ జని పాకలోఁ జొరం
బడి మఱియొక్కతూరి గరు
వంబుగ నింపెను జౌన పాత్ర; న
ప్పుడపుడు నూరకుక్క యఱ
పుల్ వినవచ్చెను భవ్వుభవ్వునన్-

శా. కట్టా! కంటికి గూర్కురాదొకో లస
త్కంజాక్షి పూసెజ్జపై

నిట్టూర్పుంగొని కూరుచుండె నింక ని
ర్నిద్రాణమై మోము చూ
పట్టెం గోమలి ఫాలభాగమునఁ జె
ల్వంబైన చేజేర్చి యి
ట్టట్టుం దాఁ దలయూఁచి యుస్సురను దీ
ర్ఘాలోచన స్వాంతయై.

ఉ. ఆకు చలింపఁ బో దల ని
శాటవి శాంతమయంబు దోఁచె శ్రీ
కాకరమూచు బంచ శరుఁ
డైన ప్రియుండరుదెంచి మెల్లనం
గై కొని కామినీకరయు
గంబును నిల్చెఁ ద్రిలోకపూజ్యరా
లా కడలేచి పైట చెఱ
గందుక దిద్దుకొనెం గ్రమంబుగాన్

తే. గీ. చెంతఁబిల్లల నిడుకొంచు జెట్టుపైనఁ
గట్టుకొనిన చక్కనిగూటఁ గాంతుఁగలిసి
హాయిగా నిద్దురంబోయె నాఖుపక్షి
కడుపునంగల నీరింత కదలనీక.

# కుటుంబిని.

దినమొక గ్రుడ్డుఁ బెట్టి కడుఁ
        దెంపరియై పదినాళ్ళకాల మూ
కనిడిన కుంపటిం బొదిగి
        గాదిలిపిల్లలఁ జేసిపెట్ట ము
క్కున నొక కందిగింజఁ గయి
        కొంచు నదే విధి నేర్పి వానికిం
బసిగొని పెంచిపెద్దగ నొ
        నర్చెఁ గృపాపరిపాక చిత్తయై.

ఉ. ప్రేమలతా! నితంబిని! వి
        వేక తనూజకు దల్లిపేరిడం
గా ముసువొంది దానిని జ
        గానఁ బ్రియంబుగఁ బాలుమీఁగడల్
తో మనుపంగఁ జూచెదవు
        తొల్లియొనర్చిన పూజయేమి సు
శ్రీమహిళాంశుఁడా నొకని
        చేనిడి చెప్పితి వప్పగింతలన్.

చ. నిలిచి యొకింతకన్గొనుము
        నీరజనేత్రి! బిడాలరాజ ముం

డు లతమఱుంగునన్నిలువ
డొంగవలెం గనుచూపు మేరలోఁ
గల కృకవాకి వాడియగు
గాఢ నఖంబుల మోముఁజీరి పి
ల్లల నొగిజేరఁ బిల్చి పది
లంబుగ జెక్కులమాటునందిడెన్.

మ. భళిరా! తానొకటిందలంపఁగనె దై
వం బొండుయోజించు ని
శ్చల సౌఖ్యంబున నోలలాడుటకు నై
సంతానముంగన్న వి
ల్లలకోడింగాని గొంతుఁగోసెను దృణ
ప్రాయంబుగా నిష్కృపా
కలితుండై యజమాని కర్మగతి కొ
క్కం డడ్డు గానోపునే.

ఉ. పోయినవారి తోడఁ బతి
పోవునె? చెంతకుఁ జేరఁదీసి లో
లేమెడఁ గానసీయక మ
హిం గడు బియ్యపుగింజలుంచి పూ
ర్ణాయువొసంగిపిల్లల న
యంబుగఁ బ్రేమలతా! కనుంగొనన్
నాయము నీకు పోవిడిచి
నం జెడిపోవుఁగదా యొకింతలోన్.

# తృప్తి.

నారీరత్నమ! యీవొసంగు కడి య
న్నంబున్ భుజింపంగనే
చేరంబోయి ఘృతీసమీపమునకున్
శీతామృత స్వచ్ఛవా
పూరంబుం గడుపారఁగ్రోలి దరిపై
మువ్వన్నె చట్రాళిపైఁ
దారుణ్యాంగుఁ డొకండొడల్ మఱచి ని
ద్రాసౌఖ్యముం జెందెడున్.

చం. కరమున జెంపపెట్టునిడఁ
గా మఱుచెక్కిలిఁ జొలుగార్చు కూ
తురు కడచూలిపట్టి యొక
తొరకు చాలనికోర బొమ్మకుం
బరిణయముం బొనర్చుటకు
బాలికఁ గన్గొని యూసడించ క
బ్బురముగఁ జూడుమా! కొవిక
బోటిక మేకొని యాదరింపుమా!

సీ. "దేహి" యంచింటికేతెంచు విప్రునకొక్క
పూట కొవ్యయమిచ్చి పుత్తువతివ!

చంకజోలెఁ దగిల్చి సాగివచ్చెడి బీద
　　విద్యార్థిఁ దన్పింపుము పెదవులాన!
చుట్టపక్కములు రా సొంపుగాఁ బంచ భ
　　క్ష్యములతో విందులిడ జగువృదబల!
అల్లారుముద్దుగా నాటాడు చిఱుతని
　　లేచెక్కుముద్దు గ్రోలెదవు కాంత!

గీ. పలుకరించి ప్రేమఁ బట్టెఁ డన్ను మొసంగఁ
దినెదవంతె చాలుఁ దృష్ణయడఁగ
ప్రేమలత! శుభాంగి! విశ్వమబ్బినఁ దృప్తి
గొనవా కింత యువ్వి కొదువబడఁగ.

ఉ. అంబురుహాక్షులెల్లఁ దల
　　లందు ధరింపఁగఁ గోటిసేయు ర
త్నంబొక చోటఁ గానఁబడి
　　సంత్యజియించి సగర్వచిత్తయై
డంబుగఁ గుక్కుటంబు పది
　　లంబుగఁ జూచుచుఁ గందిగింజ కం
టం బడ గుక్షినింపుకొను
　　టఁ గ్రహియించినదాన వంగనా!.

ఉ. పండుగపబ్బముల్ కలుగు
　　పట్ల సుఖంబుగ దూరదేశమం
దుండినఁ గూతురల్లుఁడెటు
　　లో చనుదెంచిన తృప్తిగొందు!

వంశజయాన! బంధువుల
హా! పదివేవులువచ్చినన్ ముదం
బుడఁడ దొకింతకన్న కడు
పూరటఁజెందదు చూడఁగాన్ భువిన్.

సీ. పచ్చపచ్చగనున్న ప్రతిశాఖపైప్రాలి
కఱవుదీరఁగఁ గూయఁగడఁగెఁబికము
ముచ్చటచ్చటలుగాఁ బొరలివచ్చెడునేటఁ
దనివిజెందఁగ నీది తనిసె హంస
కంటఁగాంచిన పచ్చికాయ లన్నిటిఁబట్టి
మొగము ముట్టఁగఁ గొట్టిపోసెఁ జిలుక
యాబాల గోపాల మాహ్లాదమును బొంద
దృప్తిగా నడయాడి యెనసె బర్హి

గీ. క్రిందరాలిన బియ్యపుగింజల కొఱ
కుదయముననుండి యంధకారోదయంబు
వఱకు విసుగు విరామంబు నెఱుఁగనీక
యొకటఁ గడుబాటువడెఁ బిపీలికము జగతి.

గీ. ఉవిద! యాకుపచ్చనిచీర యొండుగట్టి
రంజిలెడు మేలి ముత్యాల ఱవికఁదొడగి
తీరుగాఁ గుంకుమపుజుక్కఁ దిద్దుకొనుచు
వచ్చు నీవినిగాంచంగఁ బంజరమునఁ
గల చిలుక పల్కరించె "నక్కా" యటంచు.

# సహనము

---

పడతి ముచ్చటలకై బంధింపఁబడి పంజ
రమున రాచిల్క శాంతముగ మెలఁగె
ఏటిగాలికి తెప్పపాటుకాలము తుంగ
పుడమిపైనఁ దల లోర్పునను వ్రాల్చె
కఠినచిత్తుని ముల్లుకఱ్ఱ పోటులకుఁ శి
రమువంచి వృషభరాజములు నడిచె
కలుషాత్ముఁ డాడుపల్కులు వినన్ సుజనుండు
దూరదూరముగాఁగఁ దొలఁగిచనియె.

గీ. గంజిద్రావినబిడ్డఁ డాకటఁగృశించి
తోడిబాలురఁగూడి యాటాడఁబోయె
నరయవృద్ధాంగన యొకర్తు యావనంపు
వనితచే నీసడింపులం బడియె క్షమను.

శా. శ్రేయోదాయకరూపరేఖసుగుణ
శ్రీవైభవోపేత...యే
చాయంజూచినఁ జేయుసత్క్రియలకై
సంతోషముంబొంది యా
హా! యార్యుల్ జగతిన్నుతించినను ని
త్యానందమై నమ్రభా

వాయుత్తంబున నోర్పుతో మెలఁగె న
త్యాశ్చర్యమై తోఁపఁగాఁ.

సీ. దుడుకుచేతలోనర్చి యిడుములఁ గుడిపించు
కొడుకుగుఱ్ఱని సైచెఁ బడఁతిమిన్న
క్రోధాగ్నిచే రగుల్కొని పైఁబయికి వచ్చు
ప్రాణేశ్వరుని సైచెఁ బల్లవోష్ఠి
పాలుమీగడలకై పలుమఱుల్ వేధించు
బాలామణిని సైచె నీలవేణి
కడుపారఁగాఁ విందుగుడిచియుఁ నెపపెట్టు
చుట్టముక్కని సైచె సుందరాంగి.

గీ. జాలిఁగొని యాచరించిన మేలుమఱచి
సంచరించు కృతఘ్నులన్ సైచె నువిద
అమిత సంసారమను సాగరమును గడువ
మేలునావయై సైచె శంపాలతాంగి.

# కృతజ్ఞత.

---

నవలా! చూచితె పాలువోసి తన కూ
నం బెంచినావంచు మ
త్కృపకాంబోలు గృహంబునం దిరిగి నీ
కుంగూర్చు మార్జాల రా
జవదాన్యాఁ బోకమూల మూషికముఁ బం
జాఁగొట్టి నీశయ్యపై
కి వడిం దెచ్చి యటుంచి భద్రముగ నే
గాన సంతసంబందుచున్.

ఉ. ఆరయ ముక్కునం గిసల
యంబును గైకొనివచ్చి కీరమా
చేరువరాల్చినిల్చెఁ బ్రభు
చిత్తము బంటుని ప్రాప్తిభంగి ని
ష్కారణ వైరమూనక వె
సన్ రసపూరితమైన సత్ఫలా
హారమొసంగి గారవము
లందుమ! సాటిసతీచయంబునన్.

చం. చమరిక శాఖపైఁ బికము
చంచువునం జిదుగు న్నద్రీపవా

హామున విదల్చి కాచెఁగద
యుంచుఁ బిపీలిక మేలుగోరుచుని
బ్రమదమునన్ బొదల్ మఱుఁగు
నన్ శరముం గొనుబోయఁ జూచి పా
దమున జుఱుక్కునం గఱచి
ధన్యతఁ జెందెఁ గనుంగొనంగ దే.

సీ. దినము నీర్వోసి పెంచిన చిన్ని బాలికా
మణికై పువులుపూచె మల్లెయంటు
క్షితి నూత లునిచి పిల్చిన బాలకునిగూడి
పల్లటీలనుగొట్టెఁ బావురంబు
పలుమాఱు పాల్ ఫలంబు లొసంగిన లతాంగి
సేమమూరసి యొప్పె రామచిలుక
సంజపట్టున దోటఁజరియించెడు లలనా
మణి పాటకు పికంబు మాఱుపలికె

గీ. ధర్మనిరతుని దేశికోత్తముని నొకట
దర్శనమొనర్చు ఛాత్రుండు దండమిడియెఁ;
జాన! పెట్టిపోసిన దానవైన కతన
జగము నినుజూచి మిగుల హర్షంబునొందె.

# ప్రమోదము.

మొగిలిపువ్వుల కమ్మఁగు వాసనల మున్గి
కమల సౌందర్యభాగ్యమును బొంది
పొగడపువ్వులతావి బోరిబోరింజవిజూచి
యలజాజి పరిమళం బపహరించి
చంపకపుష్ప వాసనలతోఁ దులఁదూగి
పాటలీసుమసౌరభంబుఁ గ్రోలి
మల్లెలగంధంబుఁ గొల్లలాడి కడింది
మొల్లలవలపులం జల్లుకొలిపి

గీ. నాయికానాయకులమధ్య నలిగినలిగి
యువజనంబులలో నెంతొ యుబికియుబికి
విలసితస్మిత వదనారవిందుఁడగుచు
బొలుపుగల కుమారసమీరుఁడలరె మిగుల.

# కవి.

సాయంకాలము చేరువంబడెఁ గవీ
శా! మిన్నకుండంగ నీ
చే యెట్లొప్పు? శిరోజముల్ తెల తెలన్
జేవన్ వెలింబుచ్చగా
నాయెన్; బంగరు తారకాగణము మ
ధ్యం జిత్రముల్ వ్రాసికొం
చాయావీథుల రాయబారునిగ ర
మ్మా! యీ మహాక్షోణికిఁ.

సీ. మాంసపిండములనంబరగు గుబ్బలఁజూచి
యపరంజికుండలం చాడియాడి
యల కఫాలయమైన యాననంబునుగాంచి
చంద్రబింబమటంచు జదివి చదివి
స్రావభాజనమైన జఘనస్థలముఁజూచి
కరి శిరస్సమమంచు దరచి తరచి
భూరి హేయమయిన మోవి సొల్లునుగాంచి
పరమామృతంబంచు బలికి పలికి

గీ. క్షోణి మోహాంబుధినిముంచి చూడఁగలవు
ప్రకృతితో నెంత యైక్యత ప్రబలియున్న

బూటకములుకొన్ని వచింపఁబూనువాఁడ
విలను నిను సృష్టిజేయుటే నలువబుద్ధి.

తే. గీ. భువిని గవితారసజ్ఞులు పొగడుచున్న
నెగిరి పడవు వినమ్రుండవగుదువింక
మూఢచిత్తులు పరిహాసమునకు జొరఁగ
సరకుగొనవింత శాంతి నిశ్చలుఁడవగుచు.

సీ. ఇల నోడల్ దెగిన రాచిలుకకై దుఃఖముం
బాప, గీతలఁదేల్చి పాడుపడెదు
ఎడబాటులయి క్రిమ్మరెడు చక్రవాక దం
పతుల రాగులఁజేసి పనినిగొందు
పువ్వు పువ్వునవ్రాలి భువిఁ బెండ్లిఁజేయు తు
మ్మెదకు గానముఁగూర్చి మెప్పుగొనెదు
కంఠంబువోయి యాకటనున్న కోకిలం
బునకై చిగురొసంగి ఘనతగొందు

గీ. అనఘ! నిను ప్రేమఁజూడని మనుజుఁడరుదు
వసుమతికిఁ గావలసినట్టి బాంధవుఁడవు
దూరదేశవాసివియైన గోరబడెద
వల శిరోజముల్ తెలుపుకానయిననేమి.

# సౌహార్ధము

శతవర్షంబులు పెట్టి పెంచెనని వి
శ్వాసంబునన్ మ్రోడుగా
మృతుడన్ వ్రేలెద వాశ్రయించుకొన వా
మ్రంబొందు సుస్నేహబం
ధతతుల్ ద్రెంపుకొనంగలేక భగవ
ద్ధ్యానైక నిష్టాగరి
ష్టత గాలంబునుబుచ్చుచుంటివి ప్రయా
సన్ మేలు మేల్కొరమా!

మ. ఎవ రెవ్వారిల నీకు గువ్వయొకటా
మెంగాక; యిక్కట్లఁ బొ
ల్కొసినన్ మోహామహాంబుధిన్ మునిగి లో
కుల్ నవ్వ వేరొక్క దా
నిని జేరంజని జోడుగట్టవుశుకీ!
నీపూర్వపుణ్యంబులం
గనమా ప్రేమలతాంగి పెట్టినవి బి
క్షల్గావె నీకిన్నియున్.

సీ. ఏనాటిస్నేహమో యిదిమాలకాశ్వత్థ
ములుపెనంగొనివృద్ధి బొందెనొకట

ఏనాటికూర్మియో కాని విజ్ఞోఢైన
గువ్వ జీవితమంత గుండెనొకట
ఏనాటివిహితమో యెఱుఁగరాదు పికంబు-
తో సాటిగా ముగ్ధ కూసెనొకట
ఏనాటిచెల్మియో భానోదయముననే
లత లతాంగికి బూవుల నిడెనొకట

గీ. అరయ బోటికేనాటి ప్రియంబొ కాని
యాకలియు దప్పియు నెఱుఁగ కక్కటకట
యనిశ మా చిల్కతోడ మాటాడదొడఁగె
అలవిధాత్రుని చెయిదంబు లక్కజములు.

ఉ. ఏగతి నింతకాల మొట
నే గిరిగహ్వరమధ్యమందువం
దాఁ గడపెన్ మధువ్రతము
దారిగనుంగొని ముద్దుగా వసం
తాగమనంబునన్ విడలి
నట్టి సుమంబునవచ్చి వ్రాలె స్వే
చ్ఛాగతిఁ ; బ్రాతచెల్మి యెటు
సంభవమాయె నభేద్యమైక్షితిన్.

# కర్కశము.

ఖేలనమందు ముచ్చటలఁ
గేరెడుబాలుఁడు గ్రుక్కఁబట్టెనీ
లాలకముల్ మొగానఁబడ
నక్కట! శేనునుబుగ్గపైన గ
డ్డోలి చుఱుక్కనం గఱచె
నోర్వఁగ; నెక్కడదాపరించె నే
జాలియులేని యక్కటికి
జాతి: శరీరము గందెనెఱ్ఱగాన్.

చం. వెరవున నండముంబొదిగి
పిల్లనొనర్చి మనోవినోదినీ
పరభృత కూజితంబువిని
పాడిదలంచెదు గూటిపై టికిం
దరిమెదు నక్కటా! పొడిచి
దారుణకృత్యమయారె! నిర్దయా
కరకరటంబు ముచ్చటను
గాంచి సహించెదె కన్నుగిట్టెనే?

గీ. తాటిమొవ్వునగల చిన్నిగూటియందు
గలిగినంతలోన భుజించి కాలమెటులొ
గడుపలేక మగంటిమిం గన్నుగప్పి
యుండె దాక్షాయ్య మొందు చూపోపలేక.

# శూన్యము

నీలమౌ గగనంబు నందున
వేలకొలఁదిగఁ గాఱు మబ్బులు
గీలుకొని తిమిరములు నల్లెడ
డీలు కొలి పెనొటా !
జీవదాయకమైన సురుచిర
భావరాగ విలాససంపద
నా వసంతమ్ము బిల్లగాదుము
వీవదేమొకటా !
అల్లనల్లన గొట్టుకాడుచు
జల్లగా దిగజారె హృదయము
మెల్లమెల్లన గలబుఱుం బిలఁ
జెల్లిపోయె నయో !
పులకలెత్త నొడల్ మనోహర
లలితభావము లొలుకు గీతము
జిలుకరించెడు భ్రమరమేయెడఁ
గులుకుచుండెనొకో !
వీనులందున వేణుగానము
లీనమయ్యెను బ్రేమలతయను
మానినీమణి నాదుకంటికి
గానబడ దయ్యో !

ఊరడిలు మా రామలక్ష్మి!
యూరడిలు మపరంజిబొమ్మా!
యూరడిలుఁడో యంచలారా!
యూరడిల్లుండి!
ప్రేమలత లలనావతంసము
భూమివీడిన యామె తేజము
ప్రేమమయమై హృదయమందున
సేమమగు గాతన్
ఏమెడంబొడగన్న గోచర
మాయె శూన్యమయంబు బాపురె
మాయలోకము హేయమైనది
ఆమెఁగా కట్టా!

# నిర్జనాగారము.

(గీతము)

ఒకరి వెంటనొక్కరు క్రమంబొప్ప నింటఁ
గల సకల కవాట గవాక్షములను దెరచి
జ్ఞానముం బ్రాణములు నెందొ సాగి రద్దె
యున్నవారు మైమఱపువారు............
అంధకార బంధురమాయె నర్ధరాత్రి
పగిదిఁ; గాంతి యొందును గానబడదు తలుపు
మొలలపై యథావిధి నిష్పందలుకు డగుచు
నాడుట యె లేదు...................

సుంత యెఱిఁగింపరైరి వారెంతవారొ
చింత దక్క రెక్కల మూయుఁడింతకింత
చూతుము దిగంబరాకార శూన్యములను
నిర్జనాగారమున...................
ఇంక నాహ్లాద మొక్కింత యెఱుఁగబడదు
ఆదరార్ద్రధ్వని వినంగ రాదొకండు
మృన్మయంబగు సదనంబు పృదివియందె
కలియుట నిజంబు.................

ఇందునిసించు సంసారు లందఱొకట
స్వర్గపురిఁ జేరి స్థిరమైన భవనమొందు
పున్నెములనిచ్చికొనిరి కాపురమొనర్ప
దడయరాదింక మనము............

# శ్మశానము.

## ద్విపద.

సన్నజాజులతోడ సరితూగు నగవు
ఎన్నఁగఁ గమలంబు నెదిరించు మొగము
పరికించు జనులకుం బసిఁడినా నొడలు
కరిమంద గమనముం గడఁబెట్టు నడలు
నన్ని యిచ్చోటనే యడఁగి పోవునుగ!
మొన్నఁడింకను గంటి కెఱుఁగ రానివిగ!
తలఁచియిచ్చిన మహౌదార్యసంయుతులు
పిలిచిపెట్టినయట్టి ప్రేమపూరితులు
వలపు గొల్పెడు ముగ్ధ వనితాజనంబు
పలుకనేర్వనియట్టి బాల వ్రజంబు
వేలవేలకు నిందు విశ్రాంతిఁగొనిరి
కాలాను ధర్మ్మమై ఘనతఁగైకొనిరి
దారిఁబోయెడు మహోదార సచ్చరిత!
ఊరకేగెదు విలాసోత్ఫుల్లపురుష!
నిమిషకాలంబిందు నిలిచి కన్గొనుము!
విమలబాష్పకణంబు విడుచుచుం జనుము!
కడుఁబుణ్యాత్ముఁడైనఁ గలుషాత్ముఁడైన
గడకిదే దరియించు గదలివచ్చునుగ
పరికింప నిహలోక పరలోకములకు
సరగ శ్మశానంబె సరిహద్దు మనకు

# విచారము.

అతులితపుణ్యసాధ్వివి శ్రీ
దయానిపుణత్వ విశాలలోచనా
న్వితపురుదానశీలవు వి
వేక సుధానిధి వెంతొ సత్కథా
స్మృతియుత వొందు ప్రేమలత
విందునిధానవ వార్యసమ్మత
వ్రతవు విచారసాగర ని
వాసులఁగా మము జేసిపోతివా!

చం. పరగెడు తొట్టిలోని పసి
బాలుఁడు పాదరసంపుబుడ్డి సుం
దరముఁ గనంగఁ దాఁ గరమ్ము
గాళములం బయి కెత్తి యెద్వఁగాన్
దరుగకపోయె మద్ధృదయ
నాళములక్కట! నోరుతేవి యా
చిఁటుతని జేరఁదీసి కృపఁ
జెందు సతీమణి నెవ్వరిద్ధరన్

సీ. బ్రతుకు దుర్లభమంచు భర్తతోఁ గడమాటఁ
జెల్లింపుఁడనిచేతఁ జేయివైచి
పిన్నపెద్దలఁబిల్చి వేఱ్వేఱుగా శోక
దావాగ్ని కప్పగింతలను జెప్పి

అత్తింటఁగల యింటి యాఁడుబిడ్డలఁ బిల్వ
నంపి యందఱికి నీయాన బెట్టి
యొకచెంపఁగొట్ట వేఱొకచెంపఁ బొల్లార్చు
ముద్దుకూతుని మోము మోముఁ జేర్చి
చెంత జుట్టాలకడుపునం జిచ్చు బెట్టి
హరిపదాంభోజ చింతితస్వాంతవగుచు
సాగిపోతివా త్రుటిలోన స్వర్గపురికి
ధర విశాలాక్షి సాహసౌదార్యలక్ష్మి.

తే. గీ. ఇంతవఱకు ముద్దుగ "రామ, కృష్ణ" యనుచు
బిల్లి శ్లోకను గ్రహియింపఁ బిఱికియగుచు
నన్నిమఱచి 'కాకా' యంచు నరచుజిలుక
చందముంగాంచి యోడార్చు చానయెవరు?

మ. అవురా! చీరచెఱఁగుఁ జేకొనుచు ని
న్నర్థింపఁగా లేచి పో
దువు నారీమణి! కిన్కయిప్పుడది యెం
దున్ డాచినా వెఱ్ఱిక
న్గవదోపన్ హృదయంబుపైఁ గరము ప
ద్గండస్థలంబందు రెం .
డవ చేయుంచుక నిర్జన ప్రఘణ కు
డ్యచ్ఛాయఁ జింతించెదన్.

మ. అకటా! దైవము కన్నుగుట్టెనె? యమం
దానంద సంధాయివై

నిష్కృతిఁ గ్రుక్కితివా? స్వబాంధవులకై
నీ ముచ్చటేమాయెఁ? గాం
చి కదఁ ఱెక్కలురాని కుఱ్ఱలను నా
శీర్వాద మేరిచ్చి వా
రిఁక ; భూమండలి నిండెనా? నుదుటి నూ
ఱేండ్లాయు వీనాటితోఁ.

మ. కలలై కన్పడు జీవమా! యునికి ని
క్కంబౌనె యెందుఁ? ధరా
స్థలిపై దేహము నీవు వేఱ్వడుట యే
తథ్యంబటంచుఁ మదిం
దెలియుఁ బాపురె! యెన్నఁడే విధినో యే
తీరంబునం దద్ది వా
టిలునో చిత్తమునఁ రహస్యముగ నుం
డెం జింత్యమై యక్కటా!

# జీవితము

ఎవరవు? జీవితమా! వే
షువనం బుద్బ్వావలి విడలి కొమరాలికి నై
చవి గొనుచు బ్రొద్దు దిరుగం
గ వడిలి జీర్ణించిపోయి గాసిలెద వహో!

కం. ఔర ! నభంబున సన్నని
దారం బాధారముగొని తన్నుకొనుచు ని
స్సారంబౌ గాలి పడ
తీరుననే సంచరింతు తెలియం జెప్పుమా !

క. అసదగు సెలయేటొక్కట
విసవిస బ్రవహించి ముందు వేషవినాశా
యిసుకంబడి యింకి పోయెడి
పసనున్నది నీవిధంబు పరికింపంగన్.

క. అరరే! యక్కజము భవ
చ్చరిత్రము వినంగ సతతసంచలినివి సం
బరపడెద వారు బయటం
బరగెడు దీపంబు పగిది బన్నముపడుచున్

క. అకటకట! నీదు నిలుకడ
కొక నిశ్చయమేమి నిర్మలోదక నదియం
దొకటం బైకి నుబికి వే
ఱొకట నడంగు నీటి బుగ్గ పుర్వ్వస్థలిపైన్.

